పశువైద్య గ్రంథమాల 20 వ పుష్పము

# రాక్షసవైద్యము

గ్రంథకర్త:

"అభినవ సహదేవ" ఆయుర్వేద పశువైద్యాచార్య, వైద్యకళా విభూషణ, పశువైద్యగ్రంథమాల, ఆయుర్వేద పశుచికిత్సాలయ సంస్థాపకులు, ఆంధ్ర జాతీయ పశువైద్య విద్యాపీఠ ప్రెసిడెంటు, ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలప్రిన్సిపాల్ నగు,

డాక్టర్ యేజెళ్ల శ్రీరాములు చౌదరి,
A. V. L. M. & S., A. M. B. & B.S.
అంగలూరు, కృష్ణాజిల్లా.



1937

 [వెల రు 0-8-0.



గ్రంథకర్త:

"అభినవసహాదేవ"

యేజెళ్ల శ్రీరాములుచౌదరి

# విజ్ఞప్తి

నేను సుమారు పదిసంవత్సరములక్రిందట ఆయుర్వేద పశుచికిత్సాలయమును ఆయుర్వేద పశువైద్య గ్రంథమాలను స్థాపించి అనుభవపూర్వకముగా నప్పుడప్పుడు పశువైద్య గ్రంథముల బ్రకటించుచు వార్తాపత్రికలలో వ్యాసములువ్రాయుచు నా శక్తికొలది పశుసేవ చేయుచున్నసంగతి తామెల్లరకును దెలిసియేయున్నది. నేను వ్రాసిన గ్రంథములనుబట్టియు, నా యొద్ద తరిబియతయిన వైద్యులద్వారాను, కరపత్రముల మూలకముగను ఆంధ్రదేశమందంతటను ఆయుర్వేద పశువైద్యమును వ్యాపింపజేసితిని.

మరియొక ముఖ్యవిషయమేమన నే నిపు డొక ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాలను స్థాపించి గవర్నమెంటువారిచే రిజిష్టరు చేయించి యనేకమంది పశువైద్యులను తరిబియతు చేయుచున్నాడను. ఈకళాశాల ప్రభుత్వమువారివలన త్వరలో రికగ్నైజు కానున్నది.

ప్రస్తుత కాలపరిస్థితులనుబట్టి రైతులకును విద్యార్థులకును తదితరులకును అర్థమగునటుల సులభశైలియందు ఇరువది పశువైద్య గ్రంథములను మాపశువైద్య గ్రంథమాలతరపున బ్రకటించితిని. మా యాయుర్వేద పశువైద్య గ్రంథమాల యందు వెల్వడిన గ్రంథరాజములం దిదియు నొక్కటి. ఇయ్యది

పశుధనాభిమానులగు హైందవులకెల్లరకును హస్తభూషణమని చెప్పనగును.

మా యీగ్రంథములపై గవర్నమెంటు వెటరినరీ, అగ్రికల్చరల్, రెవిన్యూ, ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులయందలి ప్రముఖులగు నుద్యోగులును తదితర డిపార్టుమెంటులవారును జమీందారులు భూస్వాములు మున్నగు వారు పెక్కురు పెక్కు సదభిప్రాయముల నొసంగియున్నారలు.

మా యీ గ్రంథముల నాంధ్రలోకమాదరించి ప్రతి పాఠశాలయందును, ప్రతిపుస్తక భాండాగారమందును, కోఆపరేటివు సొసైటీలయందును ఉంచి మాపశువైద్య గ్రంథమాల నభివృద్ధికి దెత్తురని విశ్వసించుచున్నారము.

ఈ గ్రంథమునకు దయతో బీఠిక వ్రాసి వన్నెదెచ్చిన పశుధనాభిమాన శిరోమణికిని ముద్దులొలుకునటు లీ గ్రంథమును ద్వరలో ముద్రింపించి యిచ్చిన గ్రంథాలయప్రెస్సు మానేజరు శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని, నా యీ గ్రంథరచనమునకు సాయపడిన గ్రంథముల రచయితలకును నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.



# రాక్షసవైద్యము



## పశువులను పడగొట్టుట

గ్రామాదులలోనుండు రైతులు తమ పశువులకు వ్యాధులు వచ్చినపుడుగాని, తదితర కారణములవలన గాని పశువులను పడగొట్టవలసి యుండును. పడగొట్టుటలో ననేక సులభ మార్గములుగలవు. పశువులు నోరులేని జంతువులుగాన చాలజాగ్రత్తగా త్రాళ్లుగట్టి నెమ్మదిగా పడవేయవలెను. మానవులైనచో వారంతట వారే ఏమందైనను త్రాగుదురు. పశువులు అట్లు త్రాగక గంతులువేయును మరికొన్ని పొడుచును, మరికొన్ని కరచును, మరికొన్నితన్నును. కాబట్టి ఎంత చిన్నపశువునైనను నలుగురైదుగురు పట్టుకొని సూత్రముతో పడవేయవలెను. పడవేయకుండచేయుచికిత్సలు కొన్నియును, పడగొట్టిచేయు చికిత్సలు కొన్నియును గలవుగాన ఏయేరోగములలో నేయేసూత్రముల నుపయోగించవలెనో గ్రహించి చేయవలెను. పశువులను పడగొట్టుటనుగూర్చి నాకు తెలిసినంతవరకు ఈదిగువ నుదహరించుచున్నాను గాన చదువరులు గ్రహించుదురు గాక.

## —♦ పడగొట్టునపుడు గమనింపవలసిన ముఖ్యవిషయములు ♦—

వైద్యుడు దూరముగా నుండవలెను. రైతులే సాధ్యమైనంతవరకు పడగొట్టించవలెను. అంతకు వీలులేనిచో పడగొట్టు సూత్రములను చెప్పి చేయించవలెను. వైద్యుడు మిగులబలిష్ఠముగనుండి పిరికితనములేక ఆపశువుయొక్క గుణములను గ్రహించి తానే స్వయముగా పడగొట్టవచ్చును. పడగొట్టినతరువాత కాళ్ళను కట్టవలసి వచ్చినపుడు మిక్కిలి జాగ్రత్తగా కట్టవలెను. పశువు నిలబడునపుడుగాని, పడుకొనినపుడుగాని వెనుకకాళ్ళదగ్గర నిలుచుండరాదు. అట్టిసమయములందు పశువు చాల కోపముగానుండును. ఆపశువు కోపము పట్టజాలక వెనుకకాళ్ళతో తన్నుటకు ప్రయత్నించుచుండును. అజాగ్రత్తగా నున్నయెడల అది మనుష్యుని ముఖముమీద గాని, పొట్టలోగాని, మూత్రకోశములోగాని తన్నును. కాబట్టి వైద్యుడుగాని, తదితరులుగాని దగ్గరకు పోకుండ వెనుకకాళ్లను నెమ్మదిగా త్రాడుతో లాగుకొని నాలుగుకాళ్లు కట్టవలెను. అట్లు కట్టునపుడు పశువు తనకాళ్ళతో కట్టుమరిపి చేతులను నొక్కును. లేక తలవంచికట్టునపుడు తలమీదకూడ తన్న వచ్చును.

పశువును పడవేసిన తరువాత కాళ్లను కట్టకపూర్వమే పడినదని కొంచెము సేపున్నయెడల తటాలున లేచును. తల భాగముతో మనుష్యులను విసరును. అట్టి సమయములందు అపాయకరమైన దెబ్బలు తగులును.

పశువుపడిన వెంటనే తోకను లోతొడగుండా తీసికొని పట్టుకొనవలెను. దీనినే మడితోకయందురు.

పశువును పడవేసినతరువాత తలను నొక్కిపట్టునపుడు చెవులను బాగుగా తనిఖీ చేయవలెను. తలక్రింద చెవిపడి నలిగినపుడు చెవిభాగమందలి నరములన్నియు నలుగును. అందువలన పశువునకు ప్రాణాపాయము వెంటనే కలుగును. అందుచేతనే మన పెద్దలు పశువు పడగనే చెవిచూడమందురు.

—♦ పడవేయుసూత్రములు ♦—

(1) మొదటిపద్ధతి:—ఒక సన్నని మెత్తనితాడుగాని మోకుగాని తీసికొని ఒకచివర కొమ్ములకుగాని, తలకు తగిలించు సికమారునకుగాని, మెడకుపెట్టు పలుపునకుగాని తగిలించి మూపురముపైనుంచి ముందరకాళ్లక్రిందినుంచి పైకి చివరకొనలాగి వెన్నెముకమీదుగా మొరడుదగ్గరనుంచి వెనుక కాళ్లమీదుగా వృషణముల దగ్గరగా త్రాటిని ఉచ్చువేసి ఇద్దరుమనుష్యులు లాగిపట్టిన వెంటనే పడును. అట్టి సమయములందు జాగ్రత్తగా అది పడిపోవునపుడు మనుష్యులు ఆనుకొని, దెబ్బతగులకుండ నెమ్మదిగా పరుండబెట్టవలెను. లేనిచో జబ్బగాని ప్రక్క ఎముకలుగాని, విరుగవచ్చును. ఇటువంటి ప్రమాదములు జరుగుచుండును. సాధుత్వములేని ఎద్దులైనచో ఈ పద్ధతి మంచిది.

2 మరియొక పద్ధతి:—పశువును సరిగా నిలబెట్టి ముందు తలకు త్రాడుగట్టి చేతితో పట్టుకొని యుండుటగాని లేక

గుంజకు గాని స్తంభమునకుగాని గట్టి యుంచవలెను. తదుపరి యిదివరకు చెప్పినమాదిరిగనే రెండుభాగములందును, ఉచ్చులు వేయగ మిగిలిన తాటిని పడిపోవుభాగపు కాలిపిల్లడెక్కకు ఉచ్చువేసి నెమ్మదిగా చేతితో లాగుచుండినయెడల పడి పోవును. ఈ సూత్రము చాలా మంచిపద్ధతి.

3 మరియొక పద్ధతి:- పశువులను పడగొట్టకుండ 3 గ. బారు, గజము వెడల్పుగల స్తంభములో 10 లేక 8 కఱ్ఱలు రెండువైపుల రెండు బలమైనవి పాతవలెను; పశువుయొక్క తలభాగమును ముందు పాతిన మొదటి స్తంభమునకు కట్టి కఱ్ఱలమధ్యగానుంచి అటునిటూ కదలకుండ వెనుకకాళ్ళను పగ్గముతో వెనుక గుంజకుకట్టి తగినచికిత్సచేయవలెను. ఇంకను పశువు కఱ్ఱలమధ్యను ఉండియుగూడ గల్లంతుచేసినయెడల ఇంకొక మోకుగాని మెత్తని త్రాడుగాని, యెద్దుచుట్టూగట్టిగా త్రిప్పిచుట్టి యెద్దును చికిత్సచేయవచ్చును. ఇంకను కఱ్ఱలు అటునిటు కదలుననియు పశువుబయటికి పోవుననియు ఉద్దేశ్య మున్నయెడల కఱ్ఱలకు అడ్డముగా 2 లేక 3 చోట్ల బలమైన బద్దలు కట్టవచ్చును. ఈ కఱ్ఱలు నునుపుగను బుడుపులు లేకుండగను ఉండవలెను. కఱ్ఱలకు అప్పుడప్పుడు తారు పూయుటమంచిది.

## —♦ గేదెను పడగొట్టుట ♦—

ఇదివరకు చెప్పిన జంతువులను పడగొట్టుటకంటె గేదె లను, దున్నలను పడగొట్టుట చాలకష్టము. ఈ జాతి మహా

కూ్రరస్వభావమైనది. అందుచేత ముందుకాళ్లకు వెనుక కాళ్లకు బంధములువేసి ఒకసన్నని మెత్తనితా్రడువేసికొని రెండువైపుల రెండుకొనలుంచి నెమ్మదిగా యిద్దరుమనుష్యులు లాగవలెను. అట్లు లాగుటవలన పశువు క్రమేపిఒరిగిపడిపోవును. ఈ పద్ధతివలన పశువునకు అపాయముకలుగదు. పడిపోవు ననగా ముందు యిద్దరుమనుష్యులు పడిపోవుభాగమునకు ఆనుకొని పరుండబెట్టవలెను. తదుపరి తలను నొక్కిపెట్ట వలెను. గేదెగాని దున్నగాని చాల పొగరుగానుండి, అంకెకు రానప్పుడు మొగతా్రడువేసిగాని సిగమూరువేసిగాని నొక్కి పట్టవలెను. వాటికొమ్ములు సూదులుగా నుండుటవలనను, త్వరలో ఒకవిధమైనగోరోచనముండుటవలనను మిక్కిలిపొగరు గలదై మనుష్యుని చంపుటకు సిద్ధపడును. బంధము విడిచి నప్పుడు పశువుగాబరాపడి మనుష్యుని మీదకువచ్చును. లేదా కొమ్ములతో పొడుచును. ఇటువంటి పద్ధతులన్నియు, బాగుగా విచారించి తర్ఫీతుతో పడవేయుటయో లేక పడగొట్టించు టయో చేయవలయును.

## —♦ పశువులను పడవేయుట ♦—

ఎంతోప్రమాదమైన వ్యాధివచ్చినపుడు ఆవులను గేదె లను పడవేయవలెను గాని మాటిమాటికి పడవేయుటచాల తప్పు. ఎందుచేతనన వీటి యాహారకోశములు చాల నిండుగా నుండును. రక్తమెల్లపుడు పాలుగా మారుచుండును. పొదుగు ఎల్లపుడు కుదురుగా నుండవలెను. నోరు ఎల్లపుడు ఆడించుచుండ వలెను. కనుక యిటువంటి సుకుమార జంతువులను మాటి

మాటికిని పడవేయగాదు. పడవేసినను ఎక్కువకాలముంచ రాదు. పశువునకు కుడితిపెట్టిగాని, కడుపునిండా నీరు త్రాగు నప్పుడుగాని, పాలుతీయకుండ నున్నప్పుడుగాని పశువును పడ వేయరాదు. పైనజెప్పిన సూత్రములతో దీనిని పడవేయ వలెను.

## —♦ దూడను పడవేయుట ♦—

వీటిని సాధ్యమైనంతవరకు కాళ్లను కట్టకుండగనే కాళ్లనొక్కిపట్టి చికిత్స చేయవలెను. ఎందుచేతనన వీటికాళ్లు చాలా సున్నితముగా నుండును. బిగించి కట్టినచో తిమ్మిరి యెక్కుటయో నరములు తెగుటయో యెముకలువిరుగుటయో తటస్థించును. పైనచెప్పిన జంతువులన్నిటిని పడవేసిన తరువాత తోకనుమాత్రము కాళ్లమధ్యగాతీసి డొక్కమీదుగా ఆనించి పట్టుకొనవలెను. ఇట్లు చేసినచో పశువు కదలజాలదు. దీనిని మడితోక యందురు. తోకను మాత్రము విరువరాదు. గట్టిగానొక్కరాదు. దూడలను పట్టుకొనునప్పుడు అజాగ్రత్తగా నున్నచో కాళ్లతోతన్నును. పట్టుకొనుటకు మనుష్యులు లేన ప్పుడు, నూలుతాళ్లతో కట్టి చికిత్స చేయవలెను.

## —♦ మందులు పోయుట ♦—

పశువులకు వెదురుగొట్టములతోగాని, యిత్తడిగొట్టము లతోగాని, వెడల్పుగల సీసాలతోగాని, పోయుట చాల మంచిది. పశువులను నిలబెట్టిపోయుట చాలమంచిది. స్తంభము లకుగాని, బండికిగాని, పశువుతల నెత్తుగాగట్టి నోరు తెఱచి

నాలుక నొక్కిపెట్టి నెమ్మదిగా జారవిడువవలెను. చాల మంది మూర్ఖపుమనుష్యులు గొట్టముతో పోయునపుడు దానిమూతి పొడిచియు ముక్కురంధ్రముల గ్రుచ్చియు, అంగిటినాలుకను పొడిచియు, నానా బాధలు పెట్టుదురు. మరికొందరు వానికి ఊపిరిఆడకుండగనే గొట్టములతో మందులు పోయుదురు. అట్లు పోయుటవలన పశువునకు కొలమారి, ఊపిరాడక, ప్రాణాపాయముకూడ కలుగును. వెదురుగొట్టములకు బుడు పులుగాని, గరకుగాని, పేడులేచుటగాని యుండరాదు అట్లుండిన పోయునపుడు లోపలిభాగమందు పుండుపడి, పశువును బాధించును. సీసాలతో పోయునపుడు మూతి కొంచెము వెడల్పుగను, పొట్ట లావుగను ఉండునటులచూచి పండ్లకు తగులకుండ జాగ్రత్తగా రెండు పెదవులుకలియు భాగమందు పెట్టి నెమ్మదిగా జారవిడువవలెను. ఆ జారవిడుచునప్పుడు, సీసాను కుదించుచుండవలెను. కొందరు రైతులు గేదెలకు దున్నలకు పెద్ద ఆవుదూడలకు మందులుపోయునపుడు మెడ పలుపులు గొంతుకకుపెట్టి స్తంభమునకుకట్టి బంధము వేయక దర్జాగాపోయుదురు. ఇట్లు పోయుటవలన పశువునకు మనుష్యునకు అపాయముకలుగును. ఎందుచేతనన పలుపు మెడకు చుట్టుకొని కుత్తుకనునొక్కిన గ్రుడ్లు తేలవేయును. అట్టి సమయములయందుకూడ పోయుదురు. ముఖ్యముగా గేదెజాతికి ముందుకాళ్లకు బంధము వేసి కొమ్ములకు త్రాడుకట్టి మందు పోయుటకు వీలుగానున్నంత యెత్తున గుంజకుగాని, స్తంభము

నకుగాని, ఆ త్రాడుగట్టి మందులుపోసిన పశువునకు అపాయముండదు. పరుండబెట్టి మందుపోయుట అంత మంచిదికాదు.

## —♦ రాక్షసవైద్యము (Cauterization) ♦—

మనదేశములో ననేకులు తమ పశువులకు ఏవ్యాధి వచ్చినను ఆరంభములోనే వాతలు వేయు దురాచారము చాల కాలమునుండి తటస్థించుచున్నది. రాక్షసవైద్యమనగా వాతలు వేయుట. వాతలువేయుటనగా కాల్చుట. ఇంకను తమపశువులకు దృష్టిదోషముపోవుననియు ఎట్టివ్యాధులు రావనియు నుద్దేశముతో వాతలు వేయుచున్నారు. ఇట్లు చేయుట చాల పొరబాటు. పశువునకు వ్యాధి తగిలిన వెంటనే చికిత్సచేయవలెను. అంత మేరకుతగ్గనిచో కడపటిచికిత్స కొన్ని వ్యాధులకు ఈరాక్షస వైద్యమనియే నాయుద్దేశము. వ్యాధి తగులకుండ మంచి పశువులకుకూడా రక్షలువేయుదురు. గురక యను వ్యాధి గ్రామములో నున్నప్పుడు మంచిపశువుల కన్నిటికి కంఠముక్రింద మూడుగీతలుగాకాల్చుదురు. ఇట్లుచేయుటవలన లాభమెంతవరకున్నదో మాకు తెలియబరచిన మేముకూడ ఆచరణలో పెట్టగలము. సామాన్యముగా పశువులకు సంభవించు వ్యాధులలో చాల భాగము ఏచికిత్సయు చేయకుండగనే తగ్గిపోవును. ఇటువంటి వ్యాధులకు కూడ వాతలు వేయుచుందురు. అనవసరముగా రోగనిదానమే తెలియక వాతలు వేయుట తప్పు. కాబట్టి లోకబాంధవులు దీనదయార్ద్రహృదయులు పశుపోషణ పరాయణులునగు రైతుసోదరులందరును పశుసంతానాభివృద్ధికై పలువిధముల ప్రయత్నించి అనవసరముగ వాతలు

వేయు దురాచారమును రూపుమాపి దేశాభివృద్ధికై సాయ పడుదురుగాక.

ఈ చికిత్సయందు రెండువిధానములుగలవు. అందులో నొకటి పశువున కీకీలునకైనను, కన్నునకైనను నొప్పి చేసి నపుడు అస్థలమునందే కాల్చుట; రెండవది పశువుపదేనొక రోగ మును పొందినపుడుగాని లేక యేకారణముచేతనైన కృశించి నప్పుడుగాని దానియొక్క తత్వమును బాగుచేయు నుద్దేశ ముతో శరీరమంతయు కాల్చివేయుట-వీటినే పిఠాపురపుకాల్పు లందురు. కొందరు ఈ కాల్పులను పశువు అందముకొరకే కాల్చుదురు. ఇట్లువేయుట చాలపొరబాటు.

—♦ వాతలనుగూర్చి పటముల వివరము ♦—

ఈగ్రంథములో రైతులకు విపులముగా తెలియు లాగున ఆయారోగముల వాతలనుగూర్చి తెలిపితిమి. వాతలు వేయు టలో అనేకమంది అనేకరకములుగా వేయుదురు. మరికొందరు వారి యిష్టప్రకారము ఎక్కడ వాపున్న అక్కడనే కాల్చుట కూడా జరుగుచుండును. ఇంక కొందరు పశువులకు జబ్బువచ్చిన దనగానే దాలిపెట్టి కాల్చెదరు. కాబట్టి మేము అనేకమంది పశువైద్యులతో సంప్రదించియు వారు వేయుచుండగా ప్రత్య క్షముగా చూచియు, పూర్వ తాళపత్ర గ్రంథములను చూచియు, మాయనుభవము మీాద చికిత్సలు చేసియు ఈ పట ములను చిత్రించితిమి. పశువు శరీరములోనుండు రక్తనాళములు నరములు మున్నగునవి పరీక్షించి వాతలు పెట్టవలెను గాని అనవసరముగా పెట్టినయెడల ఒకవేళ తాత్కాలిక చికిత్సగా

శాంతించినను తదితర జబ్బులు రావచ్చును. ఇందు చూపించిన పటము లేయేరోగములకేయే చికిత్సలు చేయవలెనో నేను వ్రాసిన ప్రకారము చేయగలందులకు రైతుసోదరులను కోరుచున్నాను ఇంతియే గాకుండ దేశమునం దనేకవిధముల స్వదేశీయ విదేశీయ వైద్యులు అక్కడక్కడ నున్నారు. వీరిలో వీరికి అసూయలు. అయినది కానిది, కానిది అయినది యని సంభాషణ చేయువారు కూడ గలరు. మరికొందరు నిజమని తెలిసియు అనవసరముగా కాలయాపన చేయుదురు. కాబట్టి మీరు పశువైద్యము చేయవలెనని కోరిక యున్నయెడల ఈగ్రంథములో చెప్పిన ప్రకారము ముందు చికిత్సలుచేసి తరువాత వాతలువేసి మీపశువుల రక్షించుకొనగలందులకు ప్రార్థించుచున్నాము.

## వాత లెప్పుడు వేయవలెను

పశువునకు రక్తసంబంధమైన అనగా గురక, దొమ్మలు, కుందేటివెఱ్ఱి మున్నగు రోగములు వచ్చినప్పుడు వెంటనే మేము చెప్పిన విధముగా కాల్చుటమంచిది. వాతలువేయుటకు ముందు సమానమైన స్థలముచూడవలెను. అక్కడనే 10 గజముల దూరములో పిడకలతోగాని, బొగ్గులతోగాని దాలివేసి దాలిలో వాతలువేయు పనిముట్లుపెట్టి నిప్పుఅంటించవలెను. ఆ నిప్పునకు దగ్గరగా తదితర పశువులుగాని గడ్డిమొదలగునవిగాని యుంచరాదు. కాల్చునపుడు ఒకవిధమైన దుర్వాసనగల పొగ బయలుదేరును. అప్పుడక్కడ తదితరపశువు లున్నయెడల ఈ పొగ నవి పీల్చి ఆ వ్యాధియే తగులవచ్చునని యొక

పశుశాస్త్రజ్ఞుడు చెప్పుచున్నాడు. మనుష్యులకుకూడా నీవ్యాధి పోకునని చెప్పుదురు. నిప్పంటించినతరువాత కొలిమి తిత్తితో గాని, చేటతోగాని బాగుగా విసరుచు పైన తడిఊకపోయుచు బాగుగా ఎరుపురంగు వచ్చునట్లుగా పనిముట్లను కాల్చవలెను. తదుపరి గోనెచేగాని, ముతకగుడ్డచేగాని పనిముట్లను పట్టుకొని జాగ్రత్తగా గుర్తులుపెట్టినచోట వేయవలెను.

—♦ పశువును పడగొట్టుట ♦—

వ్యాధిచేనున్నపశువునకు అగ్నిని చూపించరాదు. అట్లు చూపించినయెడల దాని కొకవిధమైన భయము కంపము కలిగి సరిగా పండుకొనజాలక గంతులువేయును. ఈ గంతులు వేయుటవలన నింక రోగ మెక్కువగును. కాబట్టి తటాలున తీసికొని పశువును నెమ్మదిగా పడగొట్టి కాళ్ళుకట్టి ఎఱ్ఱగా కాలిన పనిముట్లచే వాతలువేసిన పశువునకేమియు నపాయమురాదు. వ్యాధి ముదిరినతరువాత కాల్చినయెడల వెంటనే చనిపోవును.

—♦ వాతలువేయుమనిషి యెట్లుండవలెను ♦—

వాతలువేయు మనిషి భగవంతుని ప్రార్థించుకొనుచు, తదితరులతో మాట్లాడక పనిముట్ల పిడులు గోనెగుడ్డతో పుచ్చుకొని వాతలువేయువలెను. కాల్చినచోటనే కాల్చక ఎక్కువసేపు పరుండబెట్టక పశువుయొక్క మంచిచెడ్డలు అనగా వాతలువేసినప్పుడు పశువుఏమిచేయుచున్నది తెలిసికొనుచు కాల్చవలెను. దానిదగ్గర ప్రత్యేక మొకరిద్దరు మనుష్యుల

నుంచి పనిముట్లు బాగా కాలుచున్నది లేనిది తనిఖీచేయు చుండవలెను. వాతలు వేయుమనిషి కట్టుపంచెలు గట్టిగా కట్టుకొని చెంగులను తొడలవరకు దోపవలెను. చొక్కా తొడుగుకొనరాదు. బనియనుమాత్రి ముండవచ్చును. కాలు చున్న పనిముట్లు పశువుదగ్గరకు తెచ్చునప్పు డెవరిని ఆయా భాగములం దుంచక దూరముగా నుంచవలెను. వాతలు వేసిన తరువాత పనిముట్లను బురదలోగాని పేడలోగాని గుచ్చ వలెను.

## —♦ వాతలువేయునపుడు గమనింపవలసినవిషయములు ♦—

పశువునకు వాతలుపెట్టుటకు పూర్వము పేడచేగాని మట్టిచేగాని మేను చూపించిన ప్రకారము గీతలుగీయవలెను. తరువాత ఆ గీతలు ప్రకారము వాతలువేయుచున్నది లేనిది పరీక్షించవలెను. పనిముట్లు సరిగా కాల్చకుండ వాతలువేసి నప్పుడు అవి బాగుగా కాలినవోలేవో చూడవలెను. అట్లు కాలనియెడల వాటినితీసి మరల బాగుగా కాలినవాటిని తీసి కొనిరావలెను. పశువు కడుపుబ్బినదా, దగ్గుచున్నదా, మూల్గు చున్నదా మొదలగునవి గ్రహించవలెను. వాతను బాగుగా వండగాల్చవలెను.

## —♦ ముంతకాల్పులు ♦—

కొందరు పశువైద్యులు లంబాడీలు మున్నగువారు తమ మందలలోనున్న పశువులకు ముంతకాల్పులు వేయుదురు. పశువున కేరోగము సంభవించినను కాళ్ళనొప్పులకు బెణుకు

లకు అన్నివిధములైన వాపులకు ముంతకాల్పులు కాల్చుదురు. చిన్న మూతిగల మట్టిపిడతనుగాని ఇటుకపిడతనుగాని తెచ్చి మూతిభాగము అగ్నిలో పెట్టి తీసి వెంటనే ఆభాగముతో గుండ్రముగా వాతవేయుదురు. ఈ విధముగా ఆయా భాగములకు తగిన పిడతలు తీసికొని కాల్చుదురు. ఈపద్ధతి కూడ మంచిదియేగాని అనవసరముగా కాల్చుటకు మాత్రము మేము సమ్మతింపము; అవసరమైనవాటికి చేయవచ్చును.

## —♦ పనిముట్లు ♦—

మన రైతులు తరచుగా గడ్డపలుగులు, కొడవళ్లు, చువ్వలు నుపయోగించెదరు. ప్రత్యేకముగా పశువులకు పనికివచ్చు పనిముట్లు చేయించి ప్రతిరైతు ఉంచుకొనుట మంచిది. గుండ్రముగా వాత వేయవలసినపుడు కొడవలిచేగాని చువ్వతోగాని కాల్చిన యెంత అందముగా నుండునో మీకే తెలియును. కాబట్టి గుండ్రముగా కావలసినప్పుడు గుండ్రనిపనిముట్లు ఏటవాలుగా కావలసినప్పుడు యేటవాలుగానుండు పనిముట్లు మున్నగునవి చక్కగాచేయించి యుంచుకొనవలెను. ఉక్కుచే చేసిన పనిముట్లు మంచివి. ఒకపశువుకు పనిముట్టుతో కాల్చినప్పుడు వాటిని శుభ్రముగా కడిగి తదితర పశువుల కవుసరము అగునప్పు డుపయోగించవలెను. ఇంకను నాపనిముట్లు పదును లేనివిగను, కోణములు లేనివిగను, సమానమగు బరువు కలిగినవిగా నుండవలెను.

## —♦ వాతలు మానుటకు మందులు ♦—

వాతలు వేసిన పుండ్లమీద ఈగలను వాలనీయరాదు.

పశువులపుండ్లకు నీరుగాని, తేమగాని తగులరాదు; తదితర పశువుల దగ్గర కట్టరాదు. కాకులను పొడువనీయకుండచూడ వలెను. చీముపట్టినపుండ్లకు అయిడోఫారము ఉపయోగించ వచ్చును. ఎరుపు పుండ్లకు టించర్ అయోడిన్ ఉపయోగించ వచ్చును. లేక పటికపొడి వెన్నపూస కలిపి నాలుగైదు దినములు రాయవచ్చును. నీలికొబ్బరినూనెలో మందు కలిపి వానితలపుండ్లకు అప్పుడప్పుడు రాయవచ్చును. వేపనూనె, ఫినైలును కూడ రాయవచ్చును.

## —♦ దొమ్మకు రక్షలు (Anthrax) ♦—

పశువు ఎడమప్రక్క బతిఎముకలసందునను, ఎదరాల లోన, తోకక్రిందను, ముక్కరంధ్రముల మీదను వాతలు వేసిన తప్పక కుదురును. లేక మూతిమీద మూడుచుక్కలు గాని, మూడు అడ్డగీతలుగాని, ఎదరాలలో రెండుచుక్కలును, తోకమట్టక్రింద ఒకఅడ్డగీత, ముచ్చిలిగుంటలో ఒకచుక్క వేయవలెను. పండగాల్చవలెను. పశువు నాలుక తెరచి కఫము తన్నుచున్నప్పుడు వాతలువేసినను లాభములేదని ముమ్మాటికి గ్రహించుడు. ఇట్టి సమయములందు వాతలు బలవంతముగా వేసినను ఆ బాధకోర్వలేక అంబాయని అరచుచు మరణించును. వాతలువేయునపుడు పశువును బలవంతముగా త్రొక్కరాదు. ఎందుచేతననగా దొమ్మసోకినపశువుకడుపు ఉబ్బును. నరములు లాగుచుండును. కన్నులను త్రిప్పుచుండును గాన జాగ్రత్తగాచూచి రక్షలువేయుటమంచిది. ఈ వ్యాధి తగిలిన పశువును నెమ్మదిగా మెత్తని ప్రదేశమందు పడవేయవలెను, గాని

మీ యిష్టమువచ్చినటుల పడవేసిన దానిబాధ భగవంతునికే ఎరుక; రెండు మూడు కోడవళ్లను, ఒక గడ్డపలుగును రెండు వన్నని చువ్వలును తెచ్చి ముందు అగ్నిలో ఇదివరకు చెప్పిన ప్రకారము కాలనిచ్చి పైనచెప్పిన వాతలు వేయవలెను.

## —♦ మిడిదొమ్మ (Anthrax) ♦—

ఈదొమ్మకూడ ప్రమాదకరమైనదని అనుభవ పశు వైద్య చింతామణిలో చెప్పబడినది. మూతిమీద వాపుపుట్టు చున్నదనగానే రక్షలు వేయవలెను. కాని ఆలసించిన లాభము లేదని గ్రహించుడు. ఇటువంటి వ్యాధులు సోకినప్పుడు వెంటనే వాతలు వేయవలెనని కోరికయున్నను దాని పడవేయుటకు గాని, పట్టుకొనుటకుగాని మనుష్యులు దొరకరు. అట్టి సమయ ములందు వ్యాధి ముదిరి చనిపోవచ్చును. గాన సోకిన వెంటనే మిడిదొమ్మకు వాతలువేయుట మంచిది. సామాన్యముగా చక్కని వయస్సులోనుండి గారాబముగా పెంచుకొనిన కోడె దూడలకే ఈదొమ్మతగులును. నాఅనుభవముమీద ఈవ్యాధి సోకినపశువులను చూడగా అవిజెందు బాధను చూచి నేనే చాల విచారపడితిని. వ్యాధి తగిలిన వెంటనే వాతలు పెట్టుట మంచిది. పశువైద్యులలో అనేక రకములుగా నుందురు. ఎవరి యిష్టప్రకారము వారు వాతలు వేయుదురు. ఒకరు వేసిన వాత లను మరియొకరు ఆక్షేపించుదురు. ఇది చాల పొరబాటు. ఆరం భములోనే మీరు అనుభవము గల వైద్యు లెవరున్నారా! వాతలు వేసినందువలన ఎన్ని కేసులు నెమ్మదించినవో శాస్త్ర జ్ఞానమేమైన నున్నదా యను విషయములు తెలిసికొని ఆ

వైద్యునిరప్పించి భారమంతయు ఆవైద్యుని మీదనే వేసి రక్షలు వేయించవలెనుగాని అందర వైద్యులను రప్పించి పోట్లాడు కొనమని చెప్పి మీపశువునకుమాత్రము అన్ని చికిత్సలు చేయించ వద్దని నాప్రార్థన.

మిడిదొమ్మకు మూతిమీద పుట్టు వాపునకు ఒక గరి ఓచే ఆరంభములోనే కాల్చి తరువాత కొమ్ములదగ్గరనుంచి ముక్కు రంధ్రములపైపుట్టువాపు పైభాగమువరకు రెండు వరుసలుగా చుక్కలు పెట్టవలెను. పశువు యెడమ భాగపు బతి ఎముకల మధ్య భాగమున ఒక అడ్డగీత గీయవలెను. ఎదరా లలో ఒక చుక్కవంతున పెట్టవలెను.

—♦ నెలుడిదొమ్మ (Anthrax) ♦—

ఈ వ్యాధినే అనేకమంది అనేకరీతులుగా నుండునని తలంచి చికిత్సలు చేయుచుందురు. పశువు దేహములో నెరడు (Spleen) అను భాగముండును. ఈ భాగము క్రమేపి ఉబ్బి ఒక నెలదినములలో చనిపోవును. ఆరంభములో రోగ నిదానమును గ్రహించి ప్రక్కఎముకలలో చిరుతగాని, తది తర కట్టువంటి పనిముట్టుచేగాని అప్పుడప్పుడు కొట్టుచు చింతామణిలోనున్న ప్రకారముగాని, పశుచికిత్సాసారమను గ్రంధములోగాని చూచి చికిత్సలుచేయుదు.

అంతకు తగ్గలేదని అనుమానమున్నపుడు మూతిమీద మూడుగీతలు, ప్రక్కఎముకలచుట్టు రెండు లేక నాలుగు గీతలు, కుడిడొక్కలో ఒకచుక్క, ముచ్చిలిగుంటవద్ద ఒక ప్లస్‌గుర్తు పెట్టవలెను.

### —♦ నాలిదొమ్మ, చలిదొమ్మ (Anthrax) ♦—

ఈ వ్యాధులకుకూడ ఎన్ని చికిత్సలుచేసినను తగ్గక వాతలు వేయుటవలన తగ్గునని అపేక్షయున్న యెడల ఇదివరకు చెప్పిన దొమ్మకు వేయురక్షలనే వేయుడు.

### —♦ నెఱడిదొమ్మకు మరియొక చికిత్స ♦—

దబ్బనము నిప్పులో కాల్చి ఎడమప్రక్క నాలుగు వేళ్ల వెడల్పున వాతవేయవలెను. దానిమీద నూనెకాచి పోసిన తగ్గును. తరువాత ఎనిమిదిగీతలుగ వాతపెట్టిన తగ్గును.

### —♦ గురక (Hemorrhagic Septicemia) ♦—

ఈ వ్యాధికూడ చాల ప్రమాదకరమైనదని ఇదివరకే తెలుపబడియున్నది. దీనికి సోకినవెంటనే కంఠమువద్ద మూడు గీతలును, ముచ్చిలిగుంటలో ఒకచుక్కయును ఎదరాలలో రెండుచుక్కలును పెట్టవలెను. ఎక్కడవేసినను వేయక పోయినను కుత్తుకదగ్గర నున్న వాపువిూద మాత్రము తప్పకుండ వేయవలెను. ఈ వాపు బాగుగా ఉబ్బి చల్లదనముగా నుండి గోంతు ఎక్కువగా నున్నచో కాల్చుట అనవసర మనియు, ఆపశువు బ్రతుకుట దుర్లభమనియు తలంచవలెను.

### —♦ జబ్బవాపు (Black quarter) ♦—

ఇదికూడ చాల ప్రమాదమైన వ్యాధి. శరీరభాగము నం దేభాగములో ఈవాపు పుట్టునో అచ్చట రక్షలువేయు టత్యవసరము. ఇట్లు రక్షలు వేయుచు వచ్చినయెడల వాపు

పైకి పోజాలక నిలిచిపోవును. ముంతకాల్పులుగాని లేక కుండ కాల్పులుగాని వేయవలెను.

—♦ గర్భశూల, ఊదు మట్టలు (Colic) ♦—

ఈ వ్యాధులకు పశువు బొడ్డుదగ్గరనుంచి రెండు డొక్కల భాగములకు సూటిగా రెండుగీతలు గీయుచు డొక్కలో కలియు గీతకు పంగనామాలు పెట్టురీతిగా రెండు గీతలు పెట్టవలెను.

—♦ ఉబ్బసము ( Asthma) ♦—

ఈవ్యాధికి ఎన్ని చికిత్సలుచేసినను తగ్గనప్పుడు ఈదిగువ చెప్పిన రీతిగ రక్షలు వేసినయెడల కొన్నిటికి తగ్గవచ్చును. నొసలునుండి మూతివరకు చుక్కలు నాదుగ్గె దు పెట్టుము. ముందరి జబ్బలమీద తొమ్మిది చుక్కలు పెట్టుము. ఎద రాలలో రెండుచుక్కలు పెట్టుము.

—♦ కుండేటివెట్టి (Gidness) ♦—

ఇది విచిత్రమైనవ్యాధి. దీనికి ఆరంభములోనే రక్షలు వేయు టత్యావసరము. ఎందుచేత ననగా మెదటిలోనుండు రక్తము ఉడుకెత్తుటవలన పశువు పిచ్చివి త్తినదానివలె గంతులు వేయునుగాన వెంటనే కొమ్ములచుట్టును, ముచ్చిలిగుంట లోను చుక్కలు పెట్టవలెను. అంతకు తీవ్రముగా నున్నయెడల నొసటినుంచి ముక్కురంధ్రముల పై భాగమువరకు చుక్కలు పెట్టవచ్చును.

### కంటిపువ్వులు

కంటిలో పువ్వులు వేసినపుడు ఎన్ని చికిత్సలు చేసినను తగ్గనప్పుడు కంటిచుట్టు రక్ష వేసిన కొన్నిటికి తగ్గును.

### కల్లవాపులు (Swellings)

ఈ వాపులలో కూడ ప్రమాదకరముగా నున్న యెడల ముంతకాల్పులుగాని, చుక్కలుగాని, చక్రాకారముగాగాని ఆవాపుయొక్క లక్షణములనుబట్టి వేయవలెను.

### కాళ్లవాపు

మోకాళ్ళవద్దగాని, మోకాలు చిప్పలమీదగాని గట్టి వాపులుపుట్టి ఎన్ని చికిత్సలుచేసినను తగ్గనప్పుడు చుక్కలు పెట్టవలెను. మోర్లువాపులకుగూడ రక్షలు వేయవచ్చును.

### మాదలు

చెవిమాదగాని, కొమ్ముమాదగాని, పార్శ్వపుమాద గాని పుట్టినప్పుడు నెమ్మదియగుట కష్టమని తామెల్లరకు తెలిసియేయున్నది. కొమ్ముమాదకు ఇంతవరకు సరియైన మందులేదనియే నా యుద్దేశ్యము. అనేక ఎద్దులను పరీక్షించి తగిన చికిత్సలుచేసితిని. ఏమియు ప్రయోజనములేకపోయెను. అట్టి సమయములందు కొందరు మూర్ఖపు మోటుపశువైద్యులు కొమ్మునుకోసి సారాయిపోసి గడ్డపలుగులచే కాల్చుదురు. ఇట్టి ఘోరములెన్నియో చేయుదురు. వీటివలన నేమియు లాభములేదు. కొందరు నేను నెమ్మదిచేసెదననిచెప్పి డాంబికములుచేసి ఏలయిదో, ఏపదో రూపాయలు జేబులో వేసికొని

వెళ్లుదురు. మరి కొందరు తిమదగ్గరనుంచుకొని నెమ్మదిచేసెద నని చెప్పి కొంతపైకము తీసికొని 'తగ్గలేదు నన్నేమిచేయుమనెద' వని రైతునకు చెప్పి తాను ఆ పశువును కోలుకొరకైనను కటిక వాండ్రకు అమ్మెదురు. ఇటువంటిఘోరము లెన్నియో ఈ దొంగివైద్యులు చేయుదురు. నేనుకూడ కొమ్ముకోసి ఆరు నెలలవరకు రాకుండ నెమ్మదిచేయగలను. అట్లు చేయు చున్నాను గాని మరల వెంటనే కొమ్ము మొదటనుంచి సెలలు వేసి కుళ్లి దుర్వాసనవేసి పశువు బాధపడుచుండును. కాని లాభ మేమియు లేదు. దానికర్మ, రైతుకర్మయని దానిని ఏఅరణ్యములకో తోలుదురు. ఇవన్నియు నా ప్రత్యక్షాను భవములు. మాదలలో కూడ రకములున్నవిగాని వాలినమాదకు బ్రహ్మదేవుడుకూడ చికిత్సచేయలేడని నా అనుభవము మీాద చెప్పుచున్నాను. కాని అట్టి పశువును ఏఅరణ్యప్రాంతమునకో తోలిన యెడల అవి తిను ఆకులనుబట్టిగాని తదితరగడ్డి జాతులను బట్టిగాని నెమ్మదియైనచో నెమ్మది కావచ్చునుగాని ప్రత్యేక ముగా నింతవరకు మందు కనిపెట్టినవారు లేరని చెప్పగలను. మున్ముందు ఎవరైనా ఈ వ్యాధికితగిన మందును కనిపెట్టినచో వారి కనేకనమస్కారము లర్పించగలను. మాదయైనకొమ్మును ఆరంభములో కోసి రక్తమెక్కువ ప్రవహించకుండ పనిముట్లతో కాల్చి తగిన మందు వేయవలెను.

చెవిమాదకు కూడ చెవిచుట్టుకాల్చవచ్చును, గాని ఎన్ని చికిత్సలు చేసినను తగ్గనప్పుడు కాల్చవలెను. ఆరంభ ములో మాత్రము కాల్చరాదు. చెవిమాదకు తాలూకా,

ఫిర్కా పశువుల డాక్టర్ల సలహాతీసికొనుట మంచిది. పార్శ్వపు మూదకు కాల్చుదురు. దీసికినూతగ్రము ఆరంభములోనే కాల్చ వచ్చును. ఆయాభాగములకు ఈతాకు కాల్పులు వేయుట మంచిది.

—♦ నిలువుకండ్లకు ♦—

పశువులకు నిలువుకండ్లు పడియున్నపుడు ముక్కురంధ్రములపైన మూడు గీతలు గీసిన తగ్గును.

—♦ మిడిలేక అబ్బుపట్టు ♦—

ఎద్దుముక్కు మొదలు తోకకొనవరకు కొలిచి ఆకొలత మధ్యభాగమేచోట తాకునో ఆతావున రక్షలు పెట్టిన తగ్గును.

—♦ ఉండెజారుట ♦—

పశువునకు ఉండె జారినప్పుడు స్వస్థానమునకు బలవంతముగా త్రోసివేసి దానిచుట్టు చక్రాకారముగ రక్ష వేసిన ఆభాగమంతయు బిగియును.

—♦ పాలదొమ్మ ♦—

దూడలకు కలుగు పాలదొమ్మకు రెండు బరిపక్కలను రక్షలు వేయవలెను.

—♦ పాతనొప్పులు (Old Pains) ♦—

పశువు జబ్బలోగాని, తుంటిలోగాని, తదితర భాగములందుగాని నొప్పిపట్టినయెడల జాగ్రత్తగా పరిశీలించి ఏభాగములో నొప్పియున్నదో, అది ఎంతకాలమునుంచి యున్నదో, దాని

కేయేచికిత్సలు చేసినారో మున్నగు విషయములన్నియు గ్రహించి చికిత్సలు చేయవలెను.

ముందుకాళ్ళలో నొప్పులు పట్టి ఎన్ని చికిత్సలు చేసినను తగ్గనపుడు ఎడమకాలునొప్పికి కుడిచెవికిని, కుడికాలి నొప్పికి ఎడమచెవికిని ఒకఇత్తడితీగె 8 అంగుళములది తీసికొని చెవి మొదటభాగమునుంచి ఒకబెత్తెడు రెండువేళ్ల కొలత కొలిచి నరములుతేలుచున్న చెవికిగుచ్చి కడియమువలె వంచవలెను. తరువాత నొప్పిగల స్థానమునకు దొండాకు పసరులో తగినంత మంచినూనె వెన్నపూసకలిపి బాగా మర్దన చేయవలెను. ఈరీతిగా వారముదినములు చేయవలెను. ఈ నొప్పి నెలదినములలో తగ్గగలదు. అంతకు తగ్గనిచో ఏభాగ మందు నొప్పియుండునో అభాగమున రక్షలు వేయవలెను.

ఇటువంటి నొప్పులకు పొక్కుమందులు వేసిన కొన్నిటికి తగ్గును; లేక మాఫిర్కా-ఆయుర్వేద పశువులడాక్టర్‌తో సాలిసైలస్ యింజెక్షన్ యిప్పించిన తగ్గును.

## —♦ ఇంజెక్షన్సు (Injections) ♦—

పశువులకిచ్చు మందులు జీర్ణకోశముగుండ పోయి అక్కడ జీర్ణించి క్రమముగా ఆహార సారములో కలిసి రక్తములోనికి పోయి గుణమిచ్చుట అందరకు తెలిసిన విషయమే. ఈ యింజక్షన్సును జాగ్రత్తగా రోగనిదానములను గ్రహించి శరీరశాస్త్ర భాగములను తెలిసికొని చేయవలెను. ఇప్పటి నవ నాగరకతపరిస్థితులనుబట్టి లోపలకు మందులను యిచ్చిననూ,

యివ్వక పోయిననూ, డాక్టరుగారు యింజక్షను ఇచ్చినారంటే వ్యాధి తగ్గినదనే రైతుల మూఢనమ్మిక. అందుకనే డాక్టరులకు డాబుసరి కావలెను. ఆంగ్లేయవైద్యములో రక్తములోనికి ఆయా రోగములకు సంబంధించిన మందులు ఎక్కించిన త్వరగా కుదురునని నమ్మిక కలదు. ముఖ్యముగా అంటువ్యాధులకు ఇంజక్షన్సు అత్యవసరమని గ్యారంటీగా చెప్పవచ్చును. ఔషధము తొందరలో గుణము కలుగ జేయవలెననిన చో దానిని శరీరమార్గము లోపలికి పంపుట ఎక్కువ లాభకారియని పండితవేత్తలు కనుగొన గలుగుదురు. ఇంతకు పూర్వమే ఆయుర్వేద పశువైద్య శాస్త్రనిర్మాతలగు మన ఋషులు రక్తము లోనికి మందు నెక్కించు విధానమును వస్తికర్మయని వాడుటవలన యిచ్చుట యింజెక్షన్ అను పదమునకు వస్తి అను పదము ప్రయోగింపబడినది. రోగపశువు ఆహారము లోనికి తీసికొనలేని స్థితియందున్నపుడు వ్యాధి ఉద్రేకముగానుండి ఔషధము జీర్ణించి రక్తనాడులలోనికి వచ్చి పనిచేయునంతటి విరామము లేనప్పుడు ఈ వస్తికర్మ చాల ఉపయోగించును.

### వస్తికర్మను శుభ్రము చేయుట

ఇంజెక్షను యిచ్చుటకు పూర్వము సిరంజి శుభ్రముగా నున్నదో లేదో, అదివరకేమైన మందులుదానితో వాడి యున్నామో లేదో, సూదుల మొనలు సరిగానున్నవో లేవో తుప్పుపట్టినవో లేవో సరిగాజూచి వాడవలెను. వాడుటకు పూర్వము సూదులను లోపన్సులో వేసి కాచి శుభ్రముగా పుల్లచే లోపలకు గుచ్చి యింజెక్షన్ ఈయవలెను. ఈ

యింజెక్షన్ యిచ్చు సిరంజిలు చాల గట్టిగా సున్నితములుగా నుండవలెను. వీటిలో 20 C. C. సిరంజిలు. (C. C. అనగా క్యూబిక్ సెంటీమీటర్సు యందురు.) 10 C. C. సిరంజీలు యింకను అధికము కావలసియున్నయెడల 40 C. C. సిరంజీలు మొదలు 100 C. C. సిరంజీవరకుండును. ఇటువంటి సిరంజీలు వగరు నీటినెక్కించుటకు ఉప్పునీటినెక్కించుటకు ఎనిమా ఆయిల్సు నెక్కించుటకు ఉపయోగించబడును. ముఖ్యముగా పశువులకు సంభవించు వ్యాధులకన్నిటికి 20 C. C. రికార్డు సిరంజీతోనే యింజెక్షను చేయుట చాలమంచిది. గ్లాసుసిరంజీలతో చేయవచ్చునుగాని వెంటనే బద్దలగును. యింజెక్షన్ చేయుటకు ముందు మందులను తయారుచేసికొని చక్కని పింగాణి డిప్పలుగాని కొలత గ్లాసులుగాని వాడవలెను. ఇంజెక్షను చేయునప్పుడు, సీసాలోమందు రాడ్డుతో లాగునప్పుడు నెమ్మదిగా లాగవలెను. కాని త్వరితముగా లాగినచో నీరు యెక్కదు. గాలిబుడగలు లేకుండ పిచికారిని చూడవలెను. ఈగాలి బుడగలు మందులో కలిసియున్నయెడల అపాయము కలిగించును. కాబట్టి కొన్నిచుక్కలను మందు సూదికిగల రంధ్రమునుండి, వెడలిపోవునటుల సిరంజిరాడ్డుతో అనగా పిచికారిలోని కడ్డీతో పైకెక్కించి పనులు చేయవలెను.

### —♦ హైపొడర్మిక్కు యింజెక్షన్ ♦—
### (Hypo-dermic Injection)

అనగా చర్మవస్థి ఇంజెక్షను. అనగా, వస్థిఅనగా చర్మము క్రింది రక్తమందు చేయబడును.

